

శ్రీరస్తు

శ్రీగణాధిపతయేనమః

## వినాయకుని చవితిరోజున వినాయకపూజ

## చేయవలసిన విధానము.

వినాయకచతుర్థిరోజున స్త్రీపురుషులు చిన్నవారు పెద్దవారు సూర్యోదయము గాకపూర్వమె నిద్రలేచి ముందుగ వినాయకుని ప్రార్థించవలెను. ఆప్రార్థనయీ పుస్తకమున వ్రాయఁబడియున్నది. ప్రార్థించినతరువాత తమపనులలోఁ బ్రవేశించిరేని నిర్విఘ్నముగఁ గార్యములు నెరవేరును. వినాయకచతుర్థినాఁడే కాక ప్రతిదినము ప్రార్థించవలయును. తరువాత నిత్యకృత్యములు దీర్చికొని వినాయకపూజకు వలయు వస్తుసామగ్రిని సంపాదించవలయును.

## పూజకుఁ గావలసిన వస్తువులు.

పూవులు, అక్షతలు, గంధము, సాంబ్రాణి, కర్పూరము, తాంబూలము, టెంకాయలు, పండ్లు, పాలు, చక్కెర, వడపప్పు, పానకం, ఉమ్మెత్తపత్రి, మాచిపత్రి, వాకుడుపత్రి, మారేడుపత్రి, గరిక, రేగుపత్రి, ఉత్తరేణుపత్రి, తులసిపత్రి, మామిడిపత్రి, గన్నేరుపత్రి, విష్ణుక్రాంతిపత్రి, దానిమ్మపత్రి, దేవదారుపత్రి, మరువము, వావిలి, జాజిపత్రి, తీగగరిక, జమ్మిపత్రి, రావిపత్రి, ఎనుమద్దిపత్రి, జిల్లేడుపత్రి, మొదలగునవి. (పూవులును పత్రియు దొరికినంతవరకు వాడును.) వినాయకునిమీదఁ గప్పుటకు జేనవెడల్పు జేనపొ

డవుగల క్రొత్తతెల్లగుడ్డపసుపులోఁదడిపి ఆరవేసియుంచవలెను. యజ్ఞోపవీతము [జంధెము]నకు బదులుగ ప్రత్తినిజేనపొడుగున సన్ననిపోగుదీసి పసుపుతోఁదడిపియుంచవలయును! లొడితెడు పొడవుగల సన్ననిపుల్లలకు జివర ప్రత్తి జుట్టి నూనెతో దడిపి [21] ఇరువదియొక్క పుల్లలుంచవలయును. పూజకు గావలసిన వస్తువులన్నియు సిద్ధపరచుకొనవలెను.

## వినాయక మండపము.

శక్తిసామర్థ్యములకు దగినట్టుగ మండపము కల్పింపవలెను. తోఁచిన యెడల అరటిస్తంభములతోను మామిడిమండలతోను, చిత్రపటములతోను, పూలదండలతోను, మండపమునలంకరించి. మండపముమధ్యమునభూమి పసుపు కుంకుమములచేగాని గోమయముతోఁగాని అలికి ముగ్గుబెట్టవలయును. ఒక పెద్ద పీటకుడిగి పసుపుకుంకుమముల నలంకరించవలయును. మండపము లేకున్నను పీటమాత్రము నుంచవలెను. పీటలేకున్న పెద్దవిస్తరియైన మండపముమధ్య అలికిన ప్రదేశమునందుంచి దానిమీద దోసెడు ధాన్యముపోసి కొద్దిగ నెరపి దానిమీద వినాయకుని నిలుపవలెను.

## వినాయకుడు

వినాయకుని బంగారము వెండి రాగి వీనిలోఁ దేనితోనైనగాని పసుపుతోఁగాని రాతితోఁగాని మంటితోఁగాని చేసికొనవలయును. పూజాద్రవ్యములన్నియు మండపముదగ్గర నుంచవలయును. తానయేపనివలన జీవనముచేయునో ఆపనికి సంబంధించియున్న ముఖ్యమగు వస్తువును వినాయకుని దగ్గరనుంచి గంధాక్షతాదులతో పూజించవలెను. అన్నివస్తువులు సిద్ధపరచుకొని పూజించువారందరు స్నానముచేసి తడిపిఆరవేసిన వస్త్రములు ధరించుకొని, అలంకారులై వినాయకుని కెదురుగా పీటమీద గూర్చుండి పూజించవలయును. పూజించే విధము తెలిసిన తానే జేసికొనవచ్చును. తెలియకున్న తెలిసినవారివలన చెప్పించుకొని పూజించవలెను, పూజ వేదోక్తముగగాని వినాయక వ్రతకల్పమందు వ్రాసియున్న విధమునగాని చేయవలయును. అట్లశక్యముగానియెడల యిందులో వ్రాసినవిధముగ పూజించి బ్రాహ్మణులకు బీదలకు శక్తికొలది దానధర్మములు

చేయవలయును. పూజప్రారంభించ బోవునప్పుడు ముందుగ ఆవునేతితోగాని, నూవులనూనెతోగాని, దీపారాధనచేయవలెను. పూజసాంతమగువరకు దీపము ఉండవలెను. ఆదీపము కుందిలో వెలిగించి పీఠముమీద ఉంచవలయును. తరువాత పూజించి నైవేద్యముచేసినపిమ్మట, వినాయకప్రార్థనము చేయవలెను. ఆప్రార్థనము యీపుస్తకమున వ్రాయబడియున్నది. ప్రార్థించిన పిమ్మట ఒక్కొక్కకైవత్తి వెలిగించి మంగళహారతు లీయవలెను. ఆమంగళహారతులు యీపుస్తకమున వ్రాయబడియున్నవి.

మంగళహారతులిచ్చిన పిదప వినాయకుని కెదురుగ [21] ఇరువదియొక్కమారు కుడిచేతితో ఎడమ చెవికొనయు, ఎడమచేతితో కుడిచెవికొనయు బట్టుకొని, గుంజిళ్లు పెట్టవలయును. ఓపికకు దగినట్లు యింకను గుంజిళ్లెన పెట్టవలయును. తరువాత ఎవరికివారె కుడిచేతితో ఎడమచెంప ఎడమచేతితో కుడిచెంప ముమ్మారువేసికొని గొంతుకూర్చొని అనగా పాదములమీద కూర్చుండి ఎవరికివారే చిన్నగ నెత్తిమీద మూడుమార్లు మొట్టుకొనవలయును గుంజిళ్లు పెట్టుటకు, చెంపలు వేసికొనుటకు మొట్టికాయలు దినుటకు సిగ్గు, అభిమానము పొందరాదు. వినాయకునికి యీమూడును ముఖ్యము. ఇవిచేయకమానినయెడల చేసినపూజవ్యర్థమగును ఏమితెలియని పసిబిడ్డలచేత వినాయకునికి మ్రొక్కించి చిన్నగ చెంపలు మొట్లు పెద్దవారు వేయవలయును. ఇందువలన వినాయకుడు మిక్కిలి సంతోషించును, మిక్కిలిప్రియము భక్తి శ్రద్ధలతో చేసినవారి కోర్కెలుతీర్చి సకలైశ్వర్యములిచ్చి బిడ్డలవలె కాపాడును. ఇది పెద్దలవాక్యము పెద్దలవాక్యమందు నమ్మకముంచినవారికి క్షేమము తప్పక కలుగును.

వినాయక చతుర్థినాడు చంద్రుని చూడరాదు. చూచినవారికి సంవత్సరములోపల అపనిందవచ్చును. పొరపాటున చూచితేని వినాయకపూజ ఆరోజున చేసియున్నందున నిందరాదు, వచ్చినను తొలగిపోవును, కనుక అందరు పూజించవలయును, పయినవ్రాసినప్రకారము మంతయుజరిగించి తుట్టతుదకు ఆనందహారతి నియ్యవలయును. ఆనందహారతియనగ ఎక్కువగకర్పూరము వెలిగించి హారతిపాటపాడుచు వినాయకునిచుట్టు త్రిప్పవలయును. హారతిపాట యిందున వ్రాయబడియున్నది. తరువాత యిష్టబంధువులతో భగవం

ఉడిచ్చినవరకు చేసికొనినపదార్థములు తృప్తిగభుజించి వేదపాదుల కుపకార ముచేసి పెద్దలను తాంబూలదక్షిణలతో సత్కరించకలయును. వినాయకుని క్రింద పోసినబియ్యము బీదలకీయవలెను, ఉద్వాసనచెప్పేరోజున వినాయకుని నీటిలోకలపవలెను. ఈ హాచుతో గాని రాతితోగాని చేసినవినాయకుని కడిగి యుంచుకొనవలెను.

## నిద్రలేవగనె చేయవలసిన వినాయకప్రార్థనము.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం । శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనంధ్యాయేత్ । సర్వవిఘ్నోపశాంతయే ।

శ్లో॥ గజాననం భూతగణాది సేవితం । కపిత్థ జంబూఫలసార భక్షితం ।
ఉమాసుతం శోకవినాశకారణం । నమామి విఘ్నేశ్వరపాదపంకజం ॥

శ్లో॥ మూషకవాహన, మోదకహస్తా । చామరకర్ణ విలంబితసూత్రా ।
వామనరూప, మహేశ్వరపుత్రా । విఘ్నవినాయక పాదనమస్తే ॥

వృత్తం॥ శ్రీవినాయక సాధుపోషకచిత్తహారి ప్రియాత్మజా ।
దేవదేవజనార్దన ప్రియ దివ్య మంగళవిగ్రహా ।
భావితాత్మ సదాముదావహ భావగమ్య పరాత్పరా ।
బ్రోతుమయ్య గణాధిపాసుర పూజితాంఘ్రిసరోరుహా ॥

పూజచేయవలసినవిధము. జలపాత్ర, ఉద్ధరిణ, పళ్లెము ఉండవలెను.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం । శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనంధ్యాయేత్ । సర్వవిఘ్నోపశాంతయే ॥

శుభతిథౌ, శోభనే, ముహూర్తే, అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే. శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే భరతవర్షే, భరతఖండే, అస్మిన్, వర్తమాన వ్యవహారిక ప్రభవాదిషష్టి సంవత్సరాణాంమధ్యే...............సంవత్సరే, దక్షిణాయనే, వర్షఋతౌ, భా

భాద్రపదమాసే, శుక్ల పక్షే, చతుర్థ్యాం............వాసరయుక్తాయాం, శుభనక్షత్ర శుభయోగ, శుభకరణాద్యనేక గుణవిశిష్టాయాం, శుభతిథౌ, మమసర్వాభీష్టసిద్ధ్యర్థం, సిద్ధివినాయక ప్రీత్యర్థం ధ్యానావాహనాది షోడశోపచార పూజాంకరిష్యే॥

శ్రీగణాధిపతయేనమః

ధ్యాయామి—నమస్కారము చేయవలెను.

ఆవాహయామి—వినాయకునిమీద పుష్పముంచవలెను.

ఆసనం సమర్పయామి — పీఠముమీద పుష్పముంచవలెను

అర్ఘ్యం సమర్పయామి—ఉద్ధరిణతో వినాయకుని చేతికి నీరు చూపి పళ్లెములో పోయవలెను.

పాద్యం సమర్పయామి—పాదముకు నీరుచూపి పళ్లెములో పోయవలెను.

ఆచమనీయం సమర్పయామి—నోటికిచూపి పళ్లెములో నీరుంచవలెను.

మధుపర్కం సమర్పయామి—చక్కెరకలిపినపాలు నోటికిచూపి పళ్లెములో నీరుంచవలెను.

పంచామృతస్నానం సమర్పయామి—పుష్పముతో వినాయకుని మీద నీరుచల్లవలెను.

శుద్ధోదకస్నానం సమర్పయామి—పుష్పముతో వినాయకునిమీద నీరుచల్లవలెను.

శ్రీగణాధిపతయేనమః.

వస్త్రయుగ్మంసమర్పయామి—పసుపువస్త్రము కప్పవలెను.

ఉపవీతం సమర్పయామి - ప్రత్తిజందెము వేయవలెను.

గంధాన్ సమర్పయామి — గంధము చల్లవలెను,
అక్షతాన్ సమర్పయామి — అక్షతలు చల్లవలెను,
పుష్పాణి పూజయామి — పూవులతో పూజచేయవలెను.

## అథాంగపూజా.

పాదౌ పూజయామి; గుల్ఫౌ పూజయామి; జానునీ పూజయామి; జంఘే పూజయామి; ఊరూ పూజయామి; కటిం పూజయామి; ఉదరం పూజయామి; నాభిం పూజయామి; హృదయం పూజయామి; కంఠం పూజయామి; స్కంధౌ పూజయామి; హస్తౌ పూజయామి; వక్త్రం పూజయామి; నేత్రే పూజయామి; కర్ణౌ పూజయామి; లలాటం పూజయామి; శిరః పూజయామి; సర్వాణ్యంగాని పూజయామి!

## ఏకవింశతి పత్రపూజ—పత్రిలతో పూజించవలెను.

మాచిపత్రిం పూజయామి; బృహతీపత్రం సమర్పయామి; బిల్వపత్రం సమర్పయామి; దూర్వాయుగ్మం సమర్పయామి; దుత్తూరపత్రిం పూజయామి; బదరీపత్రం పూజయామి; అపామార్గపత్రం సమర్పయామి; తులసీపత్రం సమర్పయామి; చూతపత్రం సమర్పయామి; కరవీరపత్రం సమర్పయామి; విష్ణుక్రాంత పత్రం సమర్పయామి; దాడిమీపత్రిం సమర్పయామి; దేవదారుపత్రం సమర్పయామి; మరువక పత్రం సమర్పయామి; సింధువార పత్రం సమర్పయామి; జాజీపత్రం సమర్పయామి; గండకీపత్రం సమర్పయామి; శమీపత్రం సమర్పయామి; అశ్వత్థ పత్రం సమర్పయామి; అర్జునపత్రం సమర్పయామి; అర్క పత్రం సమర్పయామి; ఏకవింశతి పత్రాణి పూజయామి;

## షోడశ నామపూజ అక్షతలు పూవు పత్రి కలిపి పూజ చేయవలెను,

ఓం సుముఖాయనమః; ఓం ఏకదంతాయనమః; ఓం కపిలాయనమః; ఓం గజకర్ణాయనమః; ఓం లంబోదరాయనమః; ఓం వికటాయనమః; ఓం విఘ్నరాజాయనమః; ఓం గణాధిపాయనమః; ఓం ధూమకేతవేనమః; ఓం గణాధ్యక్షాయ

నమః; ఓంఫాలచంద్రాయనమః; ఓంగజాననాయనమః; ఓంవక్రతుండాయ
నమః; ఓంశూర్పకర్ణాయనమః; ఓంహేరంబాయనమః; ఓంస్కందపూర్వ
జాయనమః; శ్రీమహాగణాధిపతయేనమః నానావిధపత్రపుష్పాక్షతాన్ సమ
ర్పయామి;

శ్రీగణాధిపతయేనమః,

ధూపమాఘ్రాపయామి—సాంబ్రాణి పొగ వేయవలెను.
దీపందర్శయామి—దీపము చూపవలెను.
నైవేద్యం సమర్పయామి—వడపప్పు పానకము టెంకాయలు పండ్లు
ముందుగ నివేదనచేసి వండినపదార్థములు నైవేద్యము చేయవలెను
సువర్ణపుష్పం సమర్పయామి—ఒకపుష్పము ఉంచవలెను,
తాంబూలం సమర్పయామి—తాంబూలం ఉంచవలెను
నీరాజనం సమర్పయామి—కర్పూరము వెలిగించవలెను,
మంత్రపుష్పం సమర్పయామి—పుష్పము ఉంచవలెను,
ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి—మూడు మారులు ప్రదక్షిణ
ముగా తిరిగి సాష్టాంగనమస్కారము చేయవలెను,
పునరర్ఘ్యం సమర్పయామి—చేతికినీరుపోసి పళ్లెములో వుంచవలెను
పూజఅయినతర్వాత ప్రార్థన [నిలువబడి]

ఉ॥ తుండము నేకదంతమును దోరపుబొజ్జయు వామహస్తముం
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లనిచూపులు మందహాసముం
కొండిక గుజ్జురూపమును కోరినవిద్దెలకెల్ల నొజ్జవై
యుండెడి పార్వతీతనయ ఓయిగణాధిపనీకు మ్రొక్కెదన్॥

రగడ॥ శ్రీగణనాయక - శ్రితజనదాయక
సిద్ధివినాయక - దేవాధీశక
సంగీతప్రియకా - మంగళవిగ్రహా
కారుణ్యాంబుధి - కలుషవిదారణ
సారసలోచన - పాపజలదముఖ

ఆపద్బాంధవ - ఆశ్రితమాధవ.
ఫణికుల భూషణ - ప్రభుసంభాషణ
మంగళఘోషణ - మాఘ్యవిభీషణ
బుధగణతోషణ - బుధజిచ్ఛోషణ
విధికృతవేషణ - విమలయనీషణ
అజముఖమండన - అరిమదఖండన
ప్రభుసంభాషణ - పరిమధగణావన
భస్మవిలేపన - భాసురదీపన
చిత్రితఫాలా - చిత్రకపోలా
పావనచరితా - భావుకభరితా
సద్గుణశీలా - చర్మసుచేలా
వటుకపాటా - బుతుపమపటా
అతులితమోదా - అంబుజపాదా
వామనరూపా - భీమప్రతాపా
భవ్యకలాపా - దివ్యాలాపా
భవభయదూరా  భక్తాధారా
కామితబంధూ - కరుణాసింధూ
మూషకవాహా - భూషితదేహా
మోదకహస్తా - బుధవిన్యస్తా
చామరకర్ణా - శశ్వద్వర్ణా
సంతతపదయా - సంతసప్రాదయా
అంబాపుత్రా - విలంబితగాత్రా
ఆశ్రితపాత్రా - అనుపమగాత్రా
విమలపతాకా - విస్మితలోకా
నిపాందఃఖరె - ప్రాపకమునియొద
భావించితిమిక - పాల సేయవె
పావకలోచన - పాపవిమోచన
ఇద్దరుతల్లుల - ముద్దులబిడ్డడ
ముజ్జగంబులకు - బొజ్జనుబొదగిన

వెజ్జు వైనమరు - గుజ్జుదేవరా
విఘ్నములెల్లన - విఘ్నముజేయగ
జాలినదేవర - శూలిప్రియంకర
బిల్వదళప్రియ - బిల్వపత్రముల
పున్నాగానన - పున్నాగంబుల
నాగభూషణా - నాగకేసరుల
చంద్రకిరీటా - చంద్రకాంతముల
మందరధీరా - మందారంబుల
శోకవిరహితయ - శోకసుమంబుల
లంబోదరదా - డింబపుష్పముల
ధూర్జటినందన - ధూపదీపముల
నారదసన్నుత - నారికేళముల
విద్యాధిపనై - వేద్యపత్రితతుల
అంచితభక్తితో - నర్పించితిమిక
నాత్మను గైకొని - యఖిలసంపదల
విద్యాబుద్ధుల - విహితవర్గనల
నేకదంతమా - కిచ్చిబ్రోవుమిదె
వందనశతముల - బొందుగజేసెద
మంజగదల్పుక - గుంజిళులనని
ప్రమోలసమర్పణ - నోలిజేసెదము
పరిపాలించవె - పరమేశ్వరజయ
మంగళారతుల - సంగతిగనుగొని
మంగళమ్ములనో - సంగుము దేవా
సర్వకార్యములు - సమకూర్చుడుదొర
మొదటిపూజలకు - మురిసెడిసామి
మ్రొక్కెద మ్రొక్కెద - మ్రొక్కెద మ్రొక్కెద

---

(కై వ త్తు ల మం గ ళ హా ర తు లు.)

1 శ్రీ వినాయకా శ్రుతివిధాయకా!
శ్రీకరప్రపంచవినుత విజయమంగళం॥

2 సోమసుందరా కైలాసమందిరా।
కామరూపఘనకలాప నిత్యమంగళం॥

3 నాగభూషణా నగజతోషణా।
నాగరాజశయనవినుత నవ్యమంగళం॥

4 పరమపావనా కరివరాననా।
పరమపురుషపాపహరణ భవ్యమంగళం॥

5 కమలమృదుపదా కామితప్రదా।
విమలహృదయ వినుతసదయవిహితమంగళం॥

6 విఘ్నకారణా విఘ్నశోషణా।
విఘ్నరాజ విమలతేజవిశ్రుతమంగళం॥

7 మోదకప్రియా మోదితక్రియా।
వేదవినుతవక్రతుండ దివ్యమంగళం॥

8 అంబికాసుతా జంబూఫలరతా।
అంబుజాసనాది పూజితాంఘ్రిమంగళం॥

9 దివిజవందితా భువననందితా।
కవిజనేడ్యమూషకేంద్ర వాహమంగళం॥

10 రమాసమార్చ్యకా ఉమాకుమారకా।
సమాహితాత్మసత్యనిరత నిత్యమంగళం॥

11 ప్రమథరంజనా ప్రమాదభంజనా।
ప్రమదదైత్యసర్వ గర్వమథనమంగళం॥

12 జ్ఞానహితకరా జ్ఞానధనపరా।
దీనజన శరణ్యా దేవదేవ మంగళం॥

13 ప్రజ్ఞాప్రభాకరా విజ్ఞాన హిమకరా।
అప్రజ్ఞావనవనతారవీర విజయమంగళం॥

14 సంగవిరహితా మంగళవ్రతా।
అంగారిహితకర ప్రసంగమంగళం॥

15 విద్యాధినాయకా విద్యాప్రదాయకా।
గద్యపద్యసాహిత్యో పాధ్యాయ మంగళం॥

16 భక్తితత్పరా మాపరాత్పరా।
భక్తిముక్తిదాసజనాసు వరదమంగళం॥

17 నీవెగతియని నమ్మియుంటిని।
బ్రోవుమయ్య మంగళముల నీకొసంగెదన్॥

18 సృష్టికర్తవీ విష్టసంపదల్।
తుష్టిపుష్టి నిమ్ము మంగళము లొసంగెదన్॥

19 నీవెతండ్రివి నీవెతల్లివి।
నీవెతోడు నీకుమంగళము లొసంగెదన్॥

20 నీవెగురుడవు నీవెప్రభుండవు।
నీవెదేవుఁడవనుగ్రహించు మంగళంబులన్॥

21 మృగపురీశ్వరా జగదధీశ్వరా।
సుగుణగణ్యా సురవరేణ్యావినుత మంగళం॥

## పూజసాంతమయిన తరువాత యివ్వవలసినఆనందహారతి పాట,

శ్రీగణనాయక సురుచిరనాయక సిద్ధి వినాయక శుభదాయకా శ్రిత ఫలదాయక సుగుణసంధాయక శృంగారనాయక సుఖదాయకా మంగళం॥ గణాధిపా మంగళం మంగళం॥

హైమవతీసుత ఆశ్రితజనహిత ఆనందగుణయుత అమరనుతా కామ విరహితప్రాకటవైభవావృత కామితఫలదాత సద్గుణోపేతా॥ మంగళం మంగళం॥

వనజసుందరపాద ఘనమనోహరనాద వినుతచతుర్వేద విమలగదా। అనవరతాహ్లాద అపరిమితామోద అనుపమాభృతవాద భక్తప్రసాదా॥ మంగళంమంగళం ఖండితశాత్రవ తండభూషితబాహు దండమండితనవ మణిశో దండా ఖండనోద్దండ వేదండముఖా శ్రీకతుండ యఖండప్రచండనుగండా॥ మంగళం మంగళం॥

సంపూర్ణము.

